ఉ. [illegible] సూచి చెప్పఁగా
[illegible]
[illegible]
[illegible]

ఇదియు నిజమైన సౌహార్ద్రరీతియు వివేకయుతము. [illegible] సస్యములు [illegible] గాను [illegible] మాత్ర [illegible].

మ. హాలికుం డోపి సమస్తబీజముల నద్యోవేళలం జల్లుచో
నెలయం బుట్టిన కోనులాంధముల నీక్షించి మున్ముందె తాఁ
దెలియుం గా సస్యఫలంబు లాకరణి నర్థిం బుద్ధిమంతుండు మ
ర్త్యుల యాకారము సూచి నిశ్చయము సేయుం దన్మనోవృత్తులన్. (మి. భే.)

ఉ. మానుషేముల్ వనంబులను మానుగ మట్పదపంక్తి పువ్వులన్
హారివిహారిచాతకలహంసము లంబుజం బత్తు లంబరా
ధారము గోరునట్లు ప్రమదంబుగ నేనును నిన్నుఁ జూడఁగా
గారణమౌటఁ జేసి ఫలకాంక్షలఁ జేరితి మిత్రలాభంబునన్. (సుహృల్లాభము)

ఉ. హారసటీరహీరరజతాద్రితుషారధరాధరేంద్రసుం
దారమరాళరాజహరనారదపారదకుందచంద్రికా
క్షీరమృణాలశంఖసురసింధుసఫేనఫణీశకాశక
ర్పూరసమానకీర్తివరభూషణ సజ్జనలోకపోషణా. (సంధివిగ్రహము)

క్రిందిపద్యమునఁ బౌరుష్యము లేని నిష్ఠురవాక్యపరంపరలను జూడుఁడు.

సీ. కలకంఠిగర్భంబు జాఱఁగిపోయిన మేలు పుట్టినప్పుడె మృతిఁ బొందమేలు
తగ ఋతుకాలంబు దప్పిపోయిన మేలు కన్యయైనను వంధ్యకంబె మేలు
కాంతుఁడు పరదేశగమనుఁడైనను మేలు మగుడ గొడ్రాలైన సుదతి మేలు
పల్లవాధర పతి నొల్లకుండిన మేలు పడఁతుక తెగులుచేఁ బడిన మేలు
గాక శాస్త్రపరిజ్ఞానఘనులు గాని, సుతులు గల్గినఁ దండ్రికి సొంపుగల దె
రూపబలవిక్రమాద్భుతాటోపులైన, నధికధనవంతులైన నయ్యర్థము లేల.

స్వభావవర్ణన యెంతమధురముగా నున్నదో చూడుఁడు. గ్రంథఫలశ్రుతి:—

చ. కదిసి పఠింప లోకహితకార్యము లెల్లను దోఁచు మూఢులై
చదువనివారికిం దెలివి చాల నొసర్పదు నీతిసంపదా
స్పద మగు నీప్రబంధము విశాలగుణోన్నతి నెల్లనాఁడు న
భ్యుదయముఁ జేయు భక్తి వినుచుండినఁ బాఠము చేయుచుండినన్.

వేకుమళ్ల - అచ్యుతరావు.

---

శా.॥ "బాలా! నీతలఁ బొప్పఁ గన్నియలకున్ భావంబు నిక్కంబు నా
లోలం బై పతిలాభలోభ మనుకల్లోలంబులం దేలుటన్;
కేలెల్లన్ హారుఁడూని యో నెఱులు నిర్నిద్రప్రమోదక్రియా
లీలన్ గ్రోలెద నట్ల నీకును బ్రియాశ్లేషంబు వే చేకుఱున్

వ. "అట్టి కల్యాణంబునకుఁ గారణంబు విను మెఱింగించెద వైశాఖశుక్లద్వాదశి నాఁటి నిశాసమయంబున సమున్నతసౌధతలంబున నీవు నిద్రించుచుండఁ గలలోన వచ్చి యొక్కఁడు నిన్నుఁ గలసె నతండు నీకుం బతియయ్యెడుం బొమ్మనిన సిగ్గుతోడి విలాసంబు దృగ్విలాసంబు నలంకరింప నింపారుమ్రొక్కున నక్కపర్దికుటుంబినిని వీడ్కొని వేడ్కలు పిక్కటిల్లు నుల్లంబుతో మరలె నప్పుడు.

క.॥ "చేసఱచి నవ్వుచుం బరి, హాసోక్తులు మెఱయుచుండ నాయుగ్మలు లి
చ్ఛాసరణిం బరమేశ్వరి, చేసినకృప తెఱఁగు ప్రణుతిచేసిరి నెమ్మిన్."

మహేశ్వరునితో నేకాంతస్థలంబునఁ దాను క్రీడించుటను బొంచిచూచి, మొదట నే, పొగ రొయ్యన నెక్కియున్న యయ్యుషకు, నిప్పుడంబ యగు పార్వతి, మరలఁ దాను హరునితో కేలెల్లఁ గూడి సోలుచుండుటను జెప్పి, యామె యవస్థ నభివృద్ధి నొందించినది. కావుననే యయ్యుష, "వేడ్కలు పిక్కటిల్లు నుల్లంబుతో" మరలినది. దీనికిఁ దోడుగ 'నాయుగ్మలులు చప్పటలు గొట్టి పరిహాసోక్తులు కూడ నాడి, యామెకు బాగుగ జ్ఞప్తియందు నక్కోర్కి యుండునట్లు చేసిరి. (ఇట్టియుష, కలలోఁ దనకు భర్తృసమాగమ మైనయప్పుడీకోర్కులు, నివ్వరము నెట్లు మఱచెనో! సోమునియుషకు నాకస్మికముగఁ గలిగి యప్పుడే యణఁగి పోయినకోర్కి గావున నామె యవ్వరమును మఱచుటయం దబ్బుర మేమియు లేదు.) ఇరువురపాత్రముల తారతమ్యము నరయుఁడు. ఇరువురుకవులును పార్వతీదేవి "వైశాఖశుక్లద్వాదశినాఁడు కలలోఁ గలయువాఁడు నీకు భర్త" యగునట్లు వర మిచ్చె నని వ్రాసిరి. (నిశాసాయం సమయములను గూర్చి పిమ్మట విమర్శించెద.) పిదపఁ గలలో ననిరుద్ధసమాగమము నడిచెను.

xi. ఆక్షే. ఇందు సోముఁడు కలలోని విచారము వర్ణించి ప్రయోజనము లేదని కాఁబోలు 'కలలోఁ గుమారుఁ డొకఁ డేమో చేసె' నని యొకపచ్చి మాట ప్రయోగించి తేల్చివైచెను."

ప్రత్యు. ఇది వ్యాఖ్యాత యపోహ! గణ్యముగను 'బహువిధావాహా' (వర్ణించెను) ... వ్యాఖ్యాతను సోమునిఁ దిద్ది వ్రాసినాఁడు నెట్టిన యెట్లు వ్రాసెనో చూడుఁడు!

"కాంతాసరోజాక్షి, బింబోష్ఠి సుపర్వినిరుపమసౌభాగ్యయుంజగా."

"సకలసురేశుఁ బ్రైతవ్యసమాగ్రతి మాంసమూరుఁ గిన్నెలకా"

సీ. "కలలోన నల్లిఁబడి గదిసి తనాతుని సత్త్వ వహించి తదీయభావముల వలికి
కంగెలితోఁ గేలు గీలించి నెమ్మేను మేనను బెరయించి మోవితోడ
బిగియారఁ గౌఁగిట సాగియించి రసనలు రెండును గదిసి యొక్కండుగాఁగ
నేఁ జొక్కి తేమెట్టి కోసిన వానికి జాబ్బన చూఱకై చొప్పనంగఁ
జతురసంభోగరసములు చవులఁ గొంట, నిద్దుఱను గ్రొత్తగాఁ గని యేఁపుమిగిలి
నట్టిచందంబు గావించి యామ్రేడితార్తి, యబలతలఁపున నచ్చొత్తినట్లు చేసె."

ఎట్టిన యిద్యోఁ గొంచె మధికముగ వర్ణించె, నని శేషగారు వ్రాసిరి.

ఎట్టిన వర్ణించిన, నది 'కొంచె మధికము' సోముఁ డుచితముగ వర్ణించి నను నది యత్యధికమును, ననుచితమును! 'ఏమో చేసె, ననునది పచ్చి! ఏమి ధర్మాధికారము! ఏకోక్తియుఁ దలంపునలేక మూర్ధమానసముతో నేకాంతస్థలం బున నిద్రించుచుండఁ, గలలోఁ గుమారుఁ డొకఁ డేమో చేసె నని తాల్చి పెం పేసం దిగ్గన మేలుకాంచి నయనోద్గీర్ణాశ్రుసిక్తాస్యయై తనకన్యకాత్వ మాఱడి పోయెననియుఁ, గులము దూషిత మైన దనియు బిట్టిల్లు సోమునియుషకును, "పసనా రెడుజన్వనముతోడను, 'రసంబు పెన్నింటలఁగూర్చి కామముతోడను, 'బంటికిఁబోక భర్తృరతి కువ్విళులూరు మనంబు' తోడను సౌధంబున నిద్రించు చుఁ గలలోఁ దన్నుఁ గదిసిన కుమారునికి నెదురొత్తు లిచ్చియు, మేలుకాంచిన పిమ్మటఁ గులము వీటిఁబోయె" నని వగచు నెట్టినయుషకును గల తారతమ్య మును గ్రంథవిస్తరభీతి నిట వ్రాయ మానితి.

"(పైరీతి నేడ్చిన) ఉషకుఁ జిత్రరేఖ పార్వతీవరమును జ్ఞప్తికిఁ దెచ్చి వెఱవ వలదని యూఱడించెను."

xii a. ఆక్షే. a. తన మఱచిపోయిన మనోరథము నాకస్మికముగ ఫలిం చుట నెఱింగిన వెంటనే సోమునియుషకుఁ దిక్క తల కెక్కినది—

ప్రత్యు. తిక్క వెంటనే తల కెక్కినట్లు సోముఁడు వ్రాయలేదు చూడుఁ డీపద్యవచనములను.

క. "మఱచితి గాక లతాంగీ, కఱకంఠునితోడ నాఁకు గాత్యాయని నీ
    నతి దెలిసఁగి నాఁడు చెప్పిన, తెఱఁ గిది [illegible] తెలియుఁటెట్టుల్?

వ. "అనుటయు నబ్బోటి చిత్తంబున నాటిం బడు నవరిభవాభిమానంబు విరిసినఁ గన్నీరు దుడిచికొని కొనలునాఁగు కోర్కులు గుఱుకుతలంపులఁ దమ కంపుమొలకలు వోడమం గడనునడిన లజ్జ క[illegible] న్నులం బెరయు నుండె నదసంతేరంబు." ౫. ఆ.

ఉషకు వెనుకఁ గలిగిననునోరథము (కోర్కి) తాత్కాలికజనిత మై యప్పుడే మఱపునకు వచ్చుదానిఁగానే సోముఁడు సూచించియున్నాఁడు గాని దాని నప్పుకు వెం పొందింపలే దని పైని వ్రాసియేయున్నాను. దేవి యిచ్చిన వరము జ్ఞప్తికి వచ్చినపిమ్మటఁ గ్రమముగాఁ గోర్కులు గుఱుకుతలంపులఁ దమ కంపుమొలకలు వోడమినట్లును, గడమునడినలజ్జ కనికన్నులం బెరయ నుండి నట్లును, పిదప వాంఛలు దినదినాభివృద్ధి నందినట్లును వ్రాసినాఁడు గాని తిక్క యొక్కమాఱే తలకెక్కినట్లు కవి వ్రాయలేదు.

ఆక్షే. ౬. "ఉషయవస్థఁ జూడుఁడు!

మ. సరసయ్యెం బరిభోగవాంఛ, తడనంబా లయ్యె నిద్రారతుల్
    పొరసయ్యెం బలుతాల్మి, వింతవగపుం బ్రోవయ్యె నాలాపముల్
    నెరసయ్యె న్మదనానలంబు, వరుసన్ నీరయ్యె నాలేపముల్
    సొరసయ్యెం దనువల్లి బాణసుతకున్ సోలింతలం దూలుచున్"

నిద్రారతుల్ దడనం బా లయ్యె" నఁట! ఈయింతలో నిద్ర వచ్చు టెట్లు? అందు "రతులఁ దడవు టెట్లు? అని యాక్షేపము.

ప్రత్యు. రతిశబ్ద ముండ భయము! ఇచ్చట 'రతి' యనఁగా సౌఖ్య మర్థము. నిద్రాసౌఖ్యములు దడవుకొనవలసివచ్చె నని భావము. ఈక్రిందిపద్యమును గనుఁడు!

శా. అద్దైతేయతనూజ నింగివడు నాహర్మ్యంబునం దొక్కనాఁ
    డేదిక్కుం జెలిపిండు మెండుకొనఁగా నేకాంతనిద్రారతిన్
    మోదింపం గలలోఁ గుమారుఁ డొకఁ డేమో చేసినం దాల్మి పెం
    పేదం దిగ్గన మేలుకాంచి నయనోదీర్ణాశ్రుసిక్తాస్య యై." ఉ. హ. పం. ౮౪.

ఇందలి 'నిద్రారతి' కేమియర్థము? ఉష యప్పటికిఁ బురుషసంగతి నే యెఱుఁగదే! "ఈయింతలో నిద్రవచ్చుట యెట్లు?" అనిరి. ఏయింతలో? పైయవస్థలు నానాఁటికిఁ గలిగినవి గాని యాయొక్కనిముసంబుననే పొడమినవి గావు.

ఆక్షే. ౧. ''చెలికత్తెతో మాటాడుచున్నట్లే నిద్ర వోవు తామసగుణ మీఁదానవరాజకుమారికిఁ దప్పని దేమో! కావుననే కాంబోలు 'దినాంతవేళ నీకలలోఁ గలయువాఁడు నీమగఁ డగు' నని పార్వతి యానతిచ్చుట!'' అని యాక్షేపించినారు.

ప్రత్యు. ''దినాంతవేళ నీకలలోఁ గలయువాఁడు నీకు మగఁ డగు'' నని సోముని యుషకును, ''నిశాసమయంబున - - - - - - - నీకుఁ బతి యగు'' నని యెఱ్ఱన యుషకును పార్వతీదేవి వరము నొసఁగినట్లు వారివారిపొత్తములలో నున్నది. దినాంతవేళ=సాయంసమయము; నిశాసమయము=రాత్రివేళ (నడురేయి యని భావము.) ఇం దేది యుచితమో కనుఁగొందము. రాక్షసులు నిశాచరు లను నామము గలవారు. వారు రాత్రులు సంచరింతురు. పగలు నిద్రింతురు. కావుననే, ''వ. - - - దివాచరంబు లగుజంతుజాలంబునకు విశ్రాంతిసమయంబును, రాత్రిచరంబు లగుప్రాణిసంతతులకు నుద్బోధసమయంబును - - -'' అని సాయంకాలమును గవులు వర్ణింతురు.

ఇదియునుగాక సాయంసమయమును 'అసురసంధ్యావేళ' యని పెద్దలు పలుకుదురు. సంధ్యలలోఁ బ్రాతస్సంధ్యయే ముఖ్యమైన దని కొందఱమతము. త్రిమూర్త్యాత్మకుండును, త్రయీతనుండును నగుభాస్కరభగవానుఁ డుదయింపఁబోవునదియు, లోకములఁ బ్రకాశింపఁజేయు సమయమునకుఁ గారణ మగునదియుఁ గావున ప్రాతస్సంధ్య పవిత్రమైన దని యార్షమతము.

శ్రుతి. ఏ తే బ్రహ్మవాదినః పూర్వాభిముఖా స్సన్ధ్యాయాం గాయత్రి యాభిమన్త్రితా ఆప ఊర్ధ్వం విక్షిపన్తి'' యజురారణ్యకము. ద్వితీ. ప్ర. ౨.

(బ్రహ్మవాదులు సంధ్యాసమయమునఁ బూర్వాభిముఖులై గాయత్రిచే నభిమంత్రితము లగునుదకములను బైకిఁ జిమ్ముదురు)

పూర్వాభిముఖులై సూర్యున కర్ఘ్యము నిచ్చుట ప్రాతస్సంధ్యాసమయమునఁ గావున నిచ్చుటఁ బ్రాతస్సంధ్యకే సంధ్యాశబ్దము ప్రాముఖ్యము నిచ్చు నని కొందఱమతము. కొందఱ ఆశ్రుతినిబట్టియే సాయంసమయమునఁ గూడఁ బూర్వాభిముఖు లయియే సూర్యదేవున కర్ఘ్యము విడుతురు.

మనసాయంకాలము రాక్షసులకు వేకువ యగును. ''వేకువను గలిగినస్వప్నము శీఘ్రఫలదాయకము'' అని స్వప్నశాస్త్రము. (కావుననే యనిరుద్ధసమాగమము కొలఁదిదినములలోఁ గలిగినది.) ఇట్టి యభిప్రాయములతోనే కాంబోలు విజ్ఞానసంపద్విఖ్యాతుఁ డగువ్యాసమహర్షి,

శ్లో. "వైశాఖే మాసి పక్షస్థిత్యాం, ద్వాదశ్యాం త్వాం నిశాగమే
రమయిష్యసి యః స్వప్నే, స తే భర్తా భవిష్యతి." హరి. విష్ణు. 117, అధ్యా.

అని మూలమున వ్రాయఁగా, దానిం గ్రహించి సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తియు, సకలాగమవేదియు నగు సోమనాథమహాకవి 'నాయం నయము' మని వ్రాసినాఁడు. (ఇచట వక్త వైశంపాయనుఁడు, శ్రోత జనమేజయుఁడు.)

ఈసంవిధాన మెంతయు ప్రశంసనీయము మరియు, ననుసరణీయము మరియు నేఁటి చెప్పనేల? ఆక్షే. c. - - - "సోముని చంద్రరేఖ,

"నినుఁ గలలోనఁ జేపట్టిన నేర్పరి ముచ్చు నెఱుంగుదేని న
య్యనువరిరూపుఁ గైకొనియు నవ్విధమునుం జరితంబుఁ జెప్పుమా
విని ప్రియుఁ దార్చెదన్ - - - - ."

అని యడిగినదఁట! కలలోఁ గన్నరూపును గైకొనియుఁ జెప్పుటయే దుర్ఘటము అట్టియెడ నవ్విధమునుం జరితంబును జెప్పుమని యడుగుట చిత్రరేఖవంటి చతురురాలికిఁ దెలివిమాలినతన మారోపించుట గాక మఱేమి?" అని వ్రాసిరి.

ప్రత్యు. కపికిం బోలె విమర్శకునకును, ఏపాత్రము చెంతకు వచ్చినప్పుడు, ఆపాత్రముగా మాఱుచుండుట విధి. ఆవిధి నతిక్రమించెనేని యాతఁడు కృతార్థుఁడు గాఁజాలఁడు. ఈఘట్టమున విమర్శకుఁడు చిత్రరేఖాభూమికం దాల్పవలయును. (చిత్రరేఖగా మాఱవలయును) అప్పు డాతనిహృదయమునుండి, యింతకుమున్న గ్రంథపరిచయమునఁ బ్రవేశించియున్న యనిరుద్ధుఁడు, వెలుపలికిఁ బోవును. అనిరుద్ధుఁ డాతనిమనంబున నుండనియప్పుడు పైయాక్షేపమే కల్గనేరదు. ఏమన,

ఉషాకన్యకకు స్వప్నమునం దగపడినవాఁ డెవ్వఁడో చిత్రరేఖ యప్పు డెఱుఁగదు. స్వప్నములలోఁ దఱచుగా, ఎఱిఁగినరూపు, చూచినరూపు, తలఁచినరూపు, వానింగూర్చినవిషయములు వచ్చుచుండును. కావున నీకలలోఁ దోఁచిననేర్పరిముచ్చు 'నెఱుంగుదేనియుక్' అనుచున్నది! ఎఱిఁగిన— లేక, చూచిన— లేక తలఁచిన— వాఁ డెవ్వఁడేని వచ్చెనేమో యని యామెయభిప్రాయము. అది ప్రాపంచికజ్ఞానము కలది.

ఉషకు స్వప్నమునఁ గానవచ్చినవాఁ డనిరుద్ధుఁ డనియు, వానిని జిత్రరేఖయు, నుషయు నెఱుంగ రనియు మన మెఱుంగుదుము గావున నిట్లాక్షే

పించుచున్నాము గాని, యింతయును నీకథ నెఱుంగనివారికి శంకయే పొడమదు. ఆలోచించి చూడుఁడు. ఇందు 'తెలివిమాలినతనము' చిత్రరేఖ దేమో!

సంస్కృతమూలమును, ఎఱ్ఱనహరివంశమును ఈయభిప్రాయమునే బోధించుచున్నవి.

శ్లో. "విజ్ఞేయో యస్య పుత్రో వై యన్నామా యత్కులశ్చ సః
ఇత్యేవ ముక్తే వచనే తత్రోషా కామమోహితా
ఉవాచ కిమస్యాఖ్యానుతాం కథం జ్ఞాస్యామ్యహం సఖి
త్వమేవ చిన్తయ సఖి నోత్తరం ప్రతిభాతి మే." హరివం. విష్ణు. 117 అ.

ఎఱ్ఱన:—

క. "చాయయు సంగము సీమయు, నామము పని నీవు చెప్ప నెఱిఁగెద వేనిన్ - - -"

పైవాని భావము లన్నియు నమానములే.

ఆత్రే. [(పిమ్మట) "జగమ్ములఁ గల తరుణపురుషుల యాకారముల నెల్లఁ బటమున వ్రాసి తెచ్చెను అందు నీపతిని గుఱుతింపు మని చెల్లి చిత్రరేఖ యింటికిఁ బోయినది. ఎఱ్ఱనయు నాయను(దాసి) వెంటనే వెడలి పోయినాఁడు. సోముఁ డన్ననో యుషాదేవిని (రాజకన్నియను) విడువక గట్టిగఁ బట్టికొనుచున్నాఁడు!"] అని వ్రాసినారు.

(వెనుక వీరు సోముని "ఉచితజ్ఞను లక్షణ పాటించువాఁడు గాఁ" ననియు నీచలక్షణము గలవాఁ డనియు వ్రాసియున్నారు. అవ్రాఁత కిది భితము పెట్టుచున్నది!)

ప్రత్యు. సోముఁడు ఉషాదేవి విరహావస్థను గొంచెము వర్ణించుటచే నేవము పొంది వీరు పైరీతిని వ్రాసినారు. దీనిం బరికింతము.

రెండువేలసంవత్సరములకుఁ బూర్వమునుండియు, మన(హిందూ)దేశమున బయలువెడలిన యనేకసంస్కృతనాటకములయందు నాయికల విరహావస్థలను (వానికి వేఱుగ రంగములు నిర్మించి) బహురీతుల వర్ణించుసంప్రదాయము కవులలోఁ గలదు; పురాణములయందును విరహిణీవర్ణనము గలదు. భాసకాళిదాసాది మహాకవుల నాటకంబులయందును, దేవీ, స్కాందాది పురాణములయందును నానావిధముల విప్రలంభశృంగారవర్ణనము చేయఁబడియున్నయది. సర్వజ్ఞుఁడగు నిక్కవియుఁ దనగ్రంథమునందలి తక్కిన యనేకకథలయందుంబోలె దీనియందును జాలవఱకు నాటకపద్ధతి నవలంబించి దీని నొక నాటకరంగస్థలంబుగ నొనర్చినాఁడు. కావున నమ్మహాకవి నట్లు దూఱుట పాడిగాదు.

xiii. [illegible] ప్రబంధమార్గమునకుఁ ద్రోవ చూపి తెలుఁగు బాసకు మహోపకారము చేసినాఁడని సూచించినాఁడు.

ప్రత్యు. అతఁడు ప్రబంధరచనమునకుఁ ద్రోవచూపినమాట సత్యమే. ప్రబంధమార్గ మనఁగా నాటకమునుబోలిన మనోహర మగు క్రొత్తమార్గము. ఇదియే అతఁడు చూపినది. ఇట్లు చూపుటయే సాహిత్యరసపోషణసంవిధాన చక్రవర్తిత్వము; నుతియు నవీనగుణసనాథత్వము. అతఁడు చూపినమనోహర మార్గమునఁ బోలేక పెద్దత్రోవలం ద్రొక్కిన యితరకవులయపరాధమున కా తఁడు బాధ్యుఁడా? ఇతరప్రబంధములలోని నానావిధవర్ణనములఁ జదివిచదివి విసిగియున్నాము గావున నాతని నిప్పుడు నిందించుచున్నాము గాని యాతని నాఁటి కాంధ్రమునకు నది నవీనమార్గమే.

xiv. ఆక్షే. "తనకు విరహతాపముఁ బరిమార్పవచ్చిన పురంధ్రీమణు లను కన్నచోట నుషాదేవి సైఁపలేక కన్నీరు విడువఁగా, నాకన్నీటిని దుడిచిన వెంటనే చెలికత్తెలు "కన్నీటం జేయి కడిగికొనవలసి"యుండు నట! ఏల యుండదో, కామాగ్నిఁ గ్రాఁగిక్రాఁగి పొంగివచ్చు నవిగాన! ఇంతటియుష్ణ మున కాకోమలాంగి కను లెట్లు నిలిచినవో!"

ప్రత్యు. సామాన్యముగా మనుజునకు 106, లేక 107 'డిగ్రీ'లజ్వరము వచ్చినప్పు డాతనిచుట్టు నుండువా రతిప్రేమమెయి నాతనిశరీరముపైఁ జేయివైచి "ఆహా! మా వానిదేహ మెట్లు సలసలఁ గ్రాఁగిపోవుచున్న"దని పలుకుచుందురు. ఇట్లు పలుకుట వాడుకయందే యున్నది. (గ్రంథములలో నతిశయోక్తు లనేకవిధము లుగ నుండును. అట్టియతిశయోక్త్యాద్యలంకారములనే మనము విమర్శింప బోఁదుమేని మనభారతవర్షమునఁ గవియనువాఁడే యుండఁడేమో!) శరీరమునుండి వెలువడుచున్న చెమటను గన్నులస్థితికి భంగము గలుగనే రదు. అది భగవన్నిర్మాణచాతుర్యములలో నొకటి.

xv. ఆక్షే. (౨) "ఎట్టిన, చిత్రరేఖ లిఖించి తెచ్చినవారి నెల్ల నుషాదేవి తో విరివిగా వర్ణించి చెప్పుచున్నాఁడు. ఈయప్రస్తుతప్రశంస మన కేల యని వారినెల్ల సోముఁ డొకపద్యములో లిఖించి, భరతఖండమున నున్నవియు లేని వియుఁ బెక్కుదేశముల పేళ్లను సంగ్రహించి యొకసీసమునిండ నొకటేసమాస ముగఁ గూర్చి, తనసర్వజ్ఞబిరుదమును సార్థకపఱచినాఁడు!" అని శర్మగా రాక్షే పించిరి. (ఇట్టిశంకలు వ్యాసమును దీర్ఘము నొనర్చుటకుఁ గాక మఱేల?)

ప్రత్యు. ఉపయోగము లేని చోట్ల నైన నెట్టిన వర్ణించెనేని యది విరి విగ వర్ణించి చెప్పుట యగును. సోముఁ డుచితమైనచోటుల వర్ణించినను నది యప్రస్తుతప్రశంస యగును.

ఇప్పు డుషాకన్యకుఁ గావలసినది యనిరుద్ధునిపటము. ఇతరరాజులపట ములను వర్ణించుచుఁ గూర్చున్నచో నది యప్రస్తుతవర్ణన మగుటయే కాక దానివలనఁ బాఠకులకు విసువు జనించుటయు నగును. తొలుతనే యనిరుద్ధుని పటము నెదుటఁ బెట్టినచో నౌచిత్యభంగ మగును. ఈవిషయములం దలంచి (పూసముత్యములకోవ వలె దేశములనెల్ల నన్నిటి నక్లిష్టముగఁ గూర్చి, తదధి పతులపటములఁ జిత్రరేఖ యుషాకన్యకుఁ జూపె నని సోముఁడు ఔచిత్యము మెఱయఁ దనకవనపాటవమును జూపెను. కవిత్రయమున నొకఁ డగుతిక్కన సోమయాజి, భీష్మపర్వప్రథమాశ్వాసమున వ్రాసిన యీదేశములపేరులం గనిన, సోముఁడు భరతఖండమున నున్నవానినే కాని లేనివానిని వ్రాయలే దని తెలియవచ్చును. (తిక్కనవ్రాఁతను వీరు గుఱుతించియున్నచో నిట్లు వ్రాయక పోవుదురు.)

వ. "పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ
కుకురు కోంకణ టంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన సుదేష్ణ సుహ్మ
కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ
పుళింద పుండ్రక పాం డ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ
విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌ ళాంగ వంగ మరాట లాట బాహ్లిక
బహుధాన కిరాత కేక యాశ్మంత కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ
నేపాళ ఘూర్జర కుంత లావంతి కానూపాదిజనపదంబులు." (40 ప. భీష్మ. ప్ర.)

ఇందుఁ గలదేశములపేళ్లనే సోముఁ డిట్లు సీసమున వ్రాసినాఁడు.

సీ. "పాంచాలపాండ్యబర్బరకిరాతాభీరకురువిదేహవిదర్భకుకురుగౌళ
గాంధారమగధకొంకణకళిందపుళిందసింధుసౌవీరాంధ్రచేదిచోళ
సాముద్రసాల్వకోసలకళింగకుళింగ వత్ససౌరాష్ట్రాంధ్రవంగమత్స్య
శూరసేనసుదేష్ణసుహ్మకాశకరూశలాటకర్ణాటమాళవమరాట
కుంతలావంతికానూపఘూర్జరత్రి, గర్తబహుధానయవనటంకణదశార్ణ
పుండ్రబాహ్లికద్రవిడకాంభోజహూణ, కేకయాశ్మంతకాశ్మీరకేరళములు.
క. "(మొదలగు ననేకములు జన, పదములు గనుఁగొనెఁ దదీయపతులను మఱియుఁ
హృదయంబె మూర్తులఁ జే, రద రమణీమనంబులోని రమణుఁడు లేమీ.")

కవిత్రయములో నింకొకఁ డగునన్నయభట్టారకుఁడు, సభాపర్వము, ప్రథమాశ్వాసమున,

సీ. "సుబలమార్కండేయ శునకవాంజాయన మాండవ్యశాండిల్య మందపాల
బకదాల్భ్యరైభ్యకభాలుకిజతుకర్ణ గౌతమకౌశికకణ్వకుత్స
సావర్ణిపర్ణాదసత్యగోపతిగోప వేనుమైత్రేయపవిత్రపాణి
ఘటజానుకాత్రేయకఠకలాపసుమిత్రహారీతతిత్తిరియాజ్ఞ్యవల్క్య
వాయుభక్షుభార్గవవ్యాసజైమిని, శుకసుమంతుపైలసుప్రతాదు
లయినమునులు - - - - (20 పద్యము)

అని మునులనామముల నొకసీసమునఁ గూర్పఁగా, నక్కవిత్రయముననే వేఱొకఁ డగు నెఱ్ఱన,

సీ. "వ్యాసభరద్వాజవాల్మీకిగౌతమ కాశ్యపజాబాలికణ్వపులహ
యాజ్ఞ్యవల్క్యాత్రిరైభ్యాంగిరోభృగుపరాశరధూమ్రగాలవశంఖలిఖిత
హారీతసంవర్తకహాయశిరశ్శౌనకభద్రకక్షీవద్విభాండకోగ్ర
బకదాల్భ్యకౌశికాపస్తంబమాండవ్యమంకణరోమశమందపాల
కఠకలాపపురోహితకాముకాయనాది,మునులు - - - - - - "

అని తనహరివంశము నుత్తరభాగమునఁ బంచమాశ్వాసమున నొకసీసమున వ్రచ్చెను. మఱియు సోమన సీసమును మెచ్చుకొని యనేకు లాంధ్రకవు లారీతిని సీసముల వ్రాసినారు. వానివివరణ మిట ననావశ్యకము.

ఈ చిత్రపటములం జూచుటలో నుషాకన్య యనిరుద్ధుని గుర్తుపట్టినరీతిని ప్రబంధపరమేశ్వరుఁ డెంతస్వాభావికముగా వర్ణించెనో కనుండు! అని శర్మగా రెఱ్ఱనను బొగడి యొకపద్యమును వ్రాసినారు.

సీ. "దేవతలను బూర్వదేవతలను జూచి దేవయోనుల నెల్లఁ దెలియఁ జూచి
- - - - - - - అనిరుద్ధుఁ జూచి యత్యాదరమున
విగతసంశయమగుచూడ్కి వేఱొకటికిఁ,బోకయాకూతకౌతుకాద్భుతవిలోల
తారకంబయి నిలుకడఁ దలఁగులీల, మనను తోడ్తోడ మాన్మథోన్మాద మంద."

ఇది పొగడఁదగినపద్యమే కాని దీనింబట్టికొని సోముని నిందించుట సరి కాదు. చూడుఁడు:—

ఇందలి 'దేవయోను' లనుశబ్ద మేమియుచితముగా నున్నది? "భూతో౽మీ దేవయోనయః, కృపీటయోని ర్జ్వలనః" ఇత్యాదు లున్నను, ఈ 'చూచి తెలియఁజూచు' లనడమా నిది వికారముగ నున్నది. ఎఱ్ఱన సత్యకాలపుఋషి.

బలరామశ్రీకృష్ణులు నిండుజవ్వనమున నొప్పియున్న కాలమున వారిని గంసుని చెంతకుఁ గొనిపోవచ్చిన యక్రూరమహాశయుఁడు దేవకీదేవిపుత్రులను నుపన్య సించుసందర్భమునందు, (ఆ. సా. ప. ప్రా. కా. ౭)

సీ. పా. "....అక్కట పుత్త్రు లెట్లుండిరో గుఱించిరి, చన్నులే పాలొల్కె చన్ను లకట!" అని ప్రస్తావించినట్లు వ్రాసినాఁడు!

ఆక్షే. (b) "(అనిరుద్ధపటము) చూచి యానందపరవశురాలై యెఱ్ఱనయుష తటాలునఁ జెప్పసంకోచించి ప్రేమపూర్వకముగ నిర్నిమేషదృష్టితో పరాకాపడక చూచుచున్నది. సోమునియుష తటాలున మొగముపైఁ గొట్టినట్లు "మనసు ముచ్చిలి చొచ్చిన వాఁడితఁడు, వీఁడుగో" అని చేసాఁచి చూపెనట! అనిరి.

ప్రత్యు. ఉషకుఁ జిత్రరేఖ బహిఃప్రాణము. తనహృదయభావము దానితోఁ జెప్పినను దనమనమున నున్నట్లే యని యామె విశ్వాసము. ఇంతలోనే మొగము మీఁదఁ గొట్టిన ట్లగునా?

ఆక్షే. (c) "ఎఱ్ఱనయుష చాల మానవతి, గంభీరహృదయ, తనమనో భావమును దటాలున వెలివెట్టదు. ఆయుష కామాతిరేక మంతయు మనసు ననే రగులుచుండును. బైటికి వచ్చినను గంభీరముగ వచ్చును గాని పచ్చి పచ్చిమాటలతో రాదు - - - ఇఁక సోమునియుష యన్ననో సర్వవిధముల విపరీతస్వభావము గలది."

ప్రత్యు. ఎఱ్ఱనయుష గాంభీర్యమును జూడుఁడు!—మఱియు - - - మన సుననే రగులుచుండుటను గనుఁడు.

చ. "అను సఖిభాషితంబులకు నంగజరాగరసంబు దోఁచుచుఁ
దనువున నాత్మఁ బిక్కటిలి దంగశి వేగిరపాటు నార్తియుఁ
ఘనముగఁ జేయ నచ్చతెలిగన్నుల ఱెప్పల నశ్రుబిందువుల్
వనరుహకేసరస్థహిమవారిలవంబులమేలు డింపఁగాన్."

వ. "నెచ్చెలి కేలు గేలం గీలించి మొఱలిం జేర్చికొని."

మ. - - - - మత్ప్రాణంబుతోఁ దుల్యగా
రమణీ యేను దలంతు నిన్నుఁ బ్రియమార న్నీవు న న్నట్టిభా
వము పాటించి భజించినం గలుగు దైవస్ఫూర్తి నాకోర్కికిన్.

క. "నిక్కము సెప్పెద నాఁదెస, నక్కటికము నీకు లేనియట్టిద యేనిన్
దిక్కారు లెవ్వరు ప్రాణము, లిక్కాయముతోడఁ బాయు నింతియు పిదపన్."

అని వాపోయి చావునకు సంసిద్ధ యైనది. అట్టిప్రాణసంకటస్థితి యందు చిత్రరేఖతోఁ దైర్యముగ దనమనోజరాగమును దెలిపియున్న యాయుష, యాని రుద్ధునిపటమును జూడఁగానే, 'మనసు తొందరపెట్టె సూర్యనక్షత్రాదివారంబు, 'బిగిరాఁ జుటపోయి రెప్పెత్తిన పేదరంబు' గలవానిని 'అలరు మూవి తూపుల వాని నంబు' వానిని పటములోనివానిని మెచ్చెను,

క. "వనను నమ్మి పొందఁ బోయితి, గనుఁగొంటిని చిత్రపటికి గైకొన నిటు చే సినఁ బోనిచ్చెనె? - - - - -" (ఎఱ్ఱనహారివం.)

అని మనమున ననుకొనిన ట్లున్నది. భర్తృపటమున చూచినమాత్రమున్న ప్రాణత్యాగ స్థితిలో నున్నచిత్రరేఖ, యిప్పుడు లాంతి కలిగి యైనది! మొదట సిగ్గుచే నించుక దాఁచినను పిమ్మట ససంభ్రమంబుగా - - - - చిత్రపటంబున నున్నయనిరుద్ధుని నంగుళీపల్లవంబున సోమునియుషవలెనే నిరూపించుచుఁ గులగోత్రాదుల నడిగినది! సోమునియుషకును విపరీతస్వభావ మేమియు లేదు. ఇవ్విషయమున నుభయ గ్రంథములను బరికించి వారిసంభాషణాదులను బరిశీలించినఁ దారతమ్యము విశదమగును.

పిమ్మట వీరు, ఇరువురుకవుల నాయికానాయకుల (ఉషానిరుద్ధుల) స్వభావములను గూర్చియు, చిత్రరేఖ యనిరుద్ధునిఁ దెచ్చుటం గూర్చియు, నాయికానాయకసమావేశాదులం గూర్చియుఁ గొంత విమర్శించి, యందు సోముని మిక్కిలియుఁ దూలనాడినారు.

ఏతద్భాగప్రత్యుత్తరమున:-- ఇరువురుకవులు నెట్టిపాత్రముల నాయికానాయకులుగఁ గైకొనిరో, వారిలక్షణము లెట్టివో, వారిమూలగ్రంథము లెట్టివో, వానియం దీకథ యేరీతి నున్నదో, ఆయాపాత్రముల నిరువురు నెట్లు పోషించిరో— మొదలగు విషయములను (అనేకోదాహరణములతో) విపులముగఁ జర్చించి యున్నాను. గ్రంథవిస్తరభీతిని దానిని బ్రస్తుతము నిలిపి ముందు నేనుబ్రకటింపఁ బోవు సంపూర్ణవిమర్శగ్రంథమునఁ జేర్చెదను.

శ్రీశర్మగారు సోమునిగ్రంథమున "నితరవిషయకము లగుప్రమాదములు గూడఁ గొన్ని కన్పట్టుచున్న" వని యాతనియెడఁ గొన్నిదోషములఁ జూపిరి.

xvi. ఆక్షేపము. (౩) "శివజ్వరము వచ్చి బలరామునితోఁ బోరునప్పుడు మాత్రము ఇతఁడు బలరాముని గదఁ డనుపేర వ్యవహరించుచున్నాఁడు. శ్రీకృష్ణునకు గదుఁ డనితమ్ముఁ డుండె నని మాత్రము మనము వినియున్నాము. - - - - ఇది ప్రమాదమే యని చెప్ప నోరురాదు గాని సదుత్తరము విచార్యమే."

ప్రత్యు. గదః, అస్యాస్తీతి గదీ=గదుఁడు=రోగముగలవాఁడు. (జ్వరము సోఁకినవాఁడు.) గదా అస్యాస్తీతి గదః=గదుఁడు=గదాయుధము దాల్చినవాఁడు.

("అర్శ ఆదిభ్యోచ్" అను సూత్రముచే మత్వర్థమున అకారప్రత్యయము రాఁగా సంస్కృతమున 'గదః' అనియుఁ, దెలుఁగున 'గదుఁడు' అనియు నయ్యెను.

పైయర్థములు నాయాచోటుల ననుసంధించుకొనునది. భాషాభూషణుఁడు గావున శబ్దచమత్కృతిని జూపెను. బలరామున కాయుధములు రెండు:—ఒకచేత గద. పెఱచేత హలము. కావుననే యతఁడు గదుఁడనియు, హలి యనియు వ్యవహరింపఁబడినాఁడు. అతఁడు గదతో యుద్ధముచేసినట్లు సోమునిహరివంశమున ననేకప్రయోగములు గలవు. గదుఁడనుప్రయోగము గలయయ్యాశ్వాసముననే 'చటులగద' యున్నట్లు వ్రాసినాఁడు. (6. ఆ. 151)

ఆక్షే. మఱియుఁ బ్రథమాశ్వాసము—

క. "ఆముసుఁడు రాక్షసకుల, స్వామి సుకృతి

వానిఁ జంపవచ్చుటకుఁ బరంధామపతి పుట్టె" ననుపద్యములో 'పరంధామపతి' యని ప్రయోగించెను. సంస్కృతమున పరంధామ యని వ్యస్తముగాఁ బ్రయుక్తమైనపదమును సమస్తముగా భ్రమించి యిట్లు వ్రాసెనని తోఁచెడిని. నాయెఱిఁగినంతవఱకు సంస్కృతాంధ్రకవు లెవ్వరును దీని నిట్లు ప్రయోగింపఁగానను. ఉపపత్తి గల్పించుటయు నసాధ్యమని తోఁచుచున్నది - - - సోముఁడు తెలుఁగునకుఁ బ్రామాణికుఁ డగును గాని సంస్కృతభాష కట్లగుట సందిగ్ధము." అని వ్రాసిరి.

ప్రత్యు. పరం ధామా యస్మిన్ సః పరంధామా పరం=కేవల మగు (దుఃఖామిశ్రమగు) ధామ=సుఖము, యస్మిన్ సః=దేనియందుఁ గలదో అది పరంధామా=వైకుంఠలోకము; పరం ధామ్నః పతిః=పరంధామపతి=వైకుంఠపతి=విష్ణువు.

పరం అనునది కేవలార్థవాచక మగునవ్యయము. స్వరాదిగణములోనిది.

శ్లో. ("పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరః" బ్రహ్మోత్త. ఉత్తర. ద్వి.

ఇవి భగవన్నామములు గావున సమస్తపదము లని కొందఱు.)

దండ - - - పరంజ్యోతిరాకార - - - రాధాకృష్ణసంవాదము. (మం. పార్వ.)

,, "శ్రీరామరామరామా త్రిలోకాభిరామా పరంధామ - - -" (సీతారా.)

"పరంధామయుద్దామసాపుర్థ్యముం జూపవే - - - -" (సుహేం. క్ర.)

స్రగ్విణి. పరంధాము దివ్యప్రభావాభిరామా - - - (శ్రీసీతా. తృతీ.)

ఇంకను ననేకప్రయోగములు గలవు.

తెనుఁగుభాషకు సోముఁడు ప్రామాణికుఁ డగునుగాని సంస్కృతమున కట్లగుట సందిగ్ధ మనిరి. ఏ తెలుఁగుకవి సంస్కృతభాషకుఁ బ్రామాణికుఁడు?

ఆక్షే. (c) "కంటిం గంటి దయానిధిం గుణనిధిం గారుణ్యపాథోనిధిన్" అని నాలవయాశ్వాసమున జనార్దనువాక్యమునఁ బునరుక్తిదోష మొండు గనఁ బడెడు." అని వ్రాసిరి.

ప్రత్యు. సామాన్యనిఘంటువులలో దయాకారుణ్యశబ్దము లేకార్థక ములుగాఁ గనఁబడుచున్నను వానికి భేదము గలదు. వాచస్పత్యాదినిఘంటు వులయందును, రసతరంగిణ్యాద్యలంకారశాస్త్రములయందును వానిభేదము వివరింపఁబడియున్నది. ఈ రెంటిభేదము సంగ్రహముగ వివరించెదను.

(a) దయ=(1) దుఃఖము నొందిన ప్రాణులవలనిజాలి, (2) పరులదుఃఖము నకు నోర్వలేమి మొ॥

(b) కారుణ్యము=[కరుణస్య (కరుణాయుక్తస్యవా, కరుణావిషయస్యవా) భావః]=పరదుఃఖహరణేచ్ఛ=పరులదుఃఖమును బోఁగొట్టవలయు ననుకోరిక - - - కావున నిది కవిత్వావేగమున నైనప్రమాదము గాదు.

ప్రత్యేకవర్ణనములయందును నితఁ డతనికన్న మించినాఁ డని చెప్పవలదు" అని శ్రీశర్మగారు వ్రాసియున్నారు. ఇరువుర గ్రంథములలోని యాయావర్ణన ముల నాయాస్థలంబులంబట్టి వానివానిప్రాశస్త్యమును పాఠకులు నిర్ణయించు కొనఁదగినదే కాని యిందుఁ జర్చింప ననువుపడదు. ఈయిద్దఱ పొత్తములనుం డియు "నేకవిషయకము లగుపద్యముల నుదాహరించెద" నని శర్మగా రిచ్చిన యుభయులపద్యములలోని మొదటిపద్యములందలి మొదటిపాదములను మాత్ర మిచ్చుటఁ జర్చించెదను.

శివునివర్ణనము. సోమన:—

సీ. "తొలుకాఱుమెఱుఁగులతోఁటలోనాడెడురాయంచకొదమతోరాయఁజాలి
యిరులబండారంపుటింటికిఁ బెట్టినబొండుమల్లెలకోటఁ బోరఁ గెలిచి
బలుమంచుఁగొండబాలలబలసిరాఁ జుట్టినక్రొత్తమంజిడిబాగు కొఱఁతచేసి
పాలవెన్నెరువుగుబ్బలిమీఁద నెలకొన్న నిండువెన్నెలముగ్గు నిగ్గు చెఱిచి

గప్పె రోదోంతరాళ మఖండఖండ, పరశుగళమూలకాకోలబాంధవంబు
బంధకీగాఢరాగానుబంధబంధు, రము సగంధాంధకారపూరము గరంబు.

గీ. కాళియాహికిసై పింఛమాళి గలసఁ, జొరలు కాళిందిలోని బుద్బుదసమేత
భూరినీరప్రవాహంబుఁబోలెఁ దార, కాసమన్వితఘోరాంధకార మడరె.

క. అసితరసాలశరాసము, భసలకలభగుణముఁ గూర్చి [1]ప్రసవాయుధుఁ డ
య్యసతుల నుపపతుల [2]వెసం, గనుగందనికలువయంపగములం బొదివెన్

సీ. వేగింపరానివియోగవహ్నులఁ గ్రాఁగి జక్కవపులుఁగులు పొక్కి పడియె
జడివట్టి వర్షించె నుడివోక పథికాంగనాధరా నేత్రపయోధరములు
బలిమిఁ గల్వకుఁబోవఁ బయనంబు గాఁజొచ్చెఁ దామరనుండి లక్ష్మీనృగాక్షి
పతివోవఁ జింతాభిహత లైరో యన దిగంగనలు చీఁకటిచేతఁ గప్పఁబడిరి
యపు డరాజక మైనరాజ్యంబునకును, రాజపుత్త్రుండు వచ్చుసంరంభ మెసఁగ
నుదయశైలసమీపంబునొయ్యఁ జేరె, యామినీకాముకుఁడుకళాధాముఁ డగుచు

గీ. గగనభల్లూకవిభు మోముజిగి యనంగ, రాత్రికేతకభూరుహప్రసవకాంతి
యనఁగఁ దూరుపు తెలతెలనయ్యె నంతఁ, దారకారాజకరరాజి తారసింప.

గీ. పంచజనుకుక్షి భేదించి పాంచజన్య, మంజనాభుండు యదువంశకంజనాభుఁ
డెత్తిపట్టిన చందంబు నిరవుకొలిపె, రక్తరుచి యైనశశి యున్కిఁ బ్రథమశిఖరి.

ఉ. స్వేతలవీఁగుఁజన్నుఁగవక్రేవలఁ గుంకుమపంకపత్త్రసం
ఘాతము గప్పినన్ దివసకాంతసుతాసలిలంబు లోచన
ప్రీతి యొనర్చులీల నృపబృంహితనూతనచంద్రతామ్రచం
ద్రాతపసంగలబ్ధిఁ జెలువారె శిలాకఠినాంధకారముల్. ౧౮౬

క. గరళశిఖు లారగించిన, హరమూర్తులువోలెఁ దారకాధిశకరో
త్కరము కర ముద్దవడి భీ, కరతిమిరౌఘముల విలయగతములు చేసెన్.

చ. సకలదిగంతరాళనిపతత్తిమిరంబులఁ గత్తిరించి పూ
ర్ణకుముదమిత్త్రచంద్రికలు నవ్యరుచిం దిలకించెఁ జాతక
ప్రకరముఁ ద్రుంచి నైచికడుభాసిలు యోగివరేణ్యబోధవా
జ్ఞికరములీల శాంతిమును సిద్ధము నైనవికాససంపదన్. [లుఁగులు

సీ. కొనవాఁడినిడుపముక్కులఁ ద్రుంచిత్రుంచి వెన్నెలమీఁగడలు మ్రింగె నెలపు
పేరెండ తాఁకున బీఱువోయిన కైరవోత్పలావలి మేని కుబ్బు వచ్చెఁ

---

[1] ప్రసవాయుధుఁ డయ్యసతుల. [2] వెసంగ్గనుగంద్దని.

జేఁ జుట్టి కెరలు[1] గ్రీయాట తేటల చంద్రకాంతము ల్లావప్రశాంతి చేసెఁ.
జిన్కు చీఁకటి పేరిచీఁకయంతయు వీడి బ్రహ్మాండభూజంబు పల్లవించె
నపరె నగవానచటులాట్టహాసవాస, వకరికరికాండకాండకేనలసఖములు
దీప్రకాంతిప్రసారితదిఙ్ముఖములు, జలజరిపుసింహానఖముల [2]తళుతళుకులు.

ఉ. శీతలవాతపోతముల చేతులు చూచుచుఁ గల్వలచ్చి కెం
తేతను పావహిల్లఁ దగుదీవెన లిచ్చుచుఁ బ్రత్యగారముం
బూతముగాఁగఁ బాదతలము ల్పచరించుచు జ్యోతిరాగమ
ఖ్యాతమునిలీల శీతకిరణాకృతి ప్రౌఢిమచూపె నేర్పునన్. ౧౫౦

వ. అప్పుడు కకుప్పాలం గుప్పలించుచుఁ దప్పుతారి యోలంబుల నణంగిన కాలాంధకారంబు దూరంబుగ వెడలించుచు నుడిపోసరతులం బతుల చేత [3]సదమదమైనమదవతీజనంబులకు మునంబొదవించుచు నదీశటంబులఁ బుటపాకచటులం బగువియోగవేదనాజాతవేదంబున ఖేదంబునొందు విరహుల కతినిగ్రహాకారి యగుచు నగుమొగంబులం జిగిదొలంకు జీవంజీవంబులకుఁ జేవదెచ్చుచుఁ బచ్చవిల్తునకు నిచ్చకంబును గమ్మతెమ్మెరకు సమ్మతియును గలువకుం జలువయును గైరవంబులకు గౌరవంబును నమృతంబునకు సుముఖత్వంబును నమకొల్పుచు వెలఁదివెన్నెల మిన్నును న్నేలయుం గప్పి కప్పూరపరాగపర్వతంబు లేకీభవించి యుద్రేకించె నన విజృంభించె నత్తఱి మత్తకాశినీచిత్తంబులు సీధురసాస్వాదాయత్తంబు లయ్యెఁ దత్తత్పదార్థనార్థంబులు ప్రబలప్రసారితంబు లయ్యె నయ్యాతుధానుండు మానసవతీసహితుండై బహువిధచమత్కారప్రకాశం బగునొక్కవివిక్తప్రదేశంబునందు నాసీనుండగుటయు. ౧౫౧

గీ. పాటలప్రసూనపల్లవభంగశీ, తలము లైనసీధుధార లాని
గ్రీష్మతాపజనితఖేదంబు నదలించు, సతులఁజూచి విభుఁడు సుతిఁజెలంగె.

క. జలరుహాకర్ణికమీఁదటఁ, దల మగుపూఁదేనె కరణిఁ దరుణి యొకతె వె
గ్గలమగు మధుపూరము కర, తలమునుచషకమునఁ బట్టి ధవు మెప్పించెన్.

క. మును దా మానఁగ నొకచవి, వెనుక న్విభుఁ డానినాన వేఱొకచవి యా
వెనుక సఖులాని యిచ్చుట, వనితలకుం బెక్కుచవులు వారుణి యొసఁగున్.

చ. కొదలు మృదూక్తులు న్మదవిఘూర్ణితలోచనపంకజంబులుం
బదిలము లేని సిగ్గుమునుపట్లును దొట్రిలుచున్నయానము

---

[1] గ్రియ్యాట. [2] ధళుధళుకులు. [3] సదుమదమైన.

ల్పనునిఁ బ్రోదిపెట్టు మదిప్రబ్బును గుబ్బటిలంగఁ జంద్రమో
పవనలు నానకేళివిభవంబు లొనర్చిరి వారివారికిన్. ౧౫౫

సీ. ఇదె తేనెపెర చూడు మించుకచవి యంచు నధరబింబఫలంబు నాననిచ్చి
యిదె పుష్పకందుకం బెద నించుకొమ్మంచు నురుతరస్తనకుంభ మురము సేర్చి
యిదె మృణాలము తల్లి పొదువు కంధర నంచుఁ గరకాండముల చేత గళముఁ జుట్టి
యిదె కల్వరేకు నీవిందు చేఁ జెమటవోఁ జిమ్ముకొమ్మని గోరఁ జిరఁ జేసి
నాథుఁ బోనీక చిక్కంగి నానావికారచాతురీధాటురీతి ప్రస్తవచన
రచనగల్పించె నొకతె యుప్రచురహాస, వికృతినొకొక మోహప్రవేశముననొ.

గీ. చంద్రకాంతశకలచషకసంపూరిత, మధువుఁ గ్రోలఁ గ్రోల విధుకరములఁ
బానపాత్రగరఁగుపరిపాటి యొఱుఁగక, వెలఁది యొకతె సారె వెదకెఁ దొడఁగె.

ఉ. నీలకనీనికావిజితనీరజనాయకరత్న మొక్క హం
సాలసయాన సీధురస మానుచుఁ దత్ప్రతిబింబితాస్యప
ద్మాలఘుకాంతివాసనకునై పచరించిన కల్వరేకులం
జాలిక నవ్వఁగా వెఱఁజియాడఁదొడంగె నఖాగ్రధారలన్. ౧౫౭

సీ. పవనంబునకు నైనఁ బాయఁదట్టఁగరాని పయ్యెదకప్పులు బయలుపడియె
నధరపల్లవకాంతు లక్షిపద్మములందు వేడ్క నొయ్యొక్కింత విశ్రమించె
మాటాడనేరని మౌగ్ధ్యంబు విడనాకి ప్రౌఢిమ తనుదానె గాఢమయ్యెఁ
బరమయోగికి నైన భావింపఁగారాని యానందసంపద యల్లుకొనియె [నియోఁ
మఱపుఘనమయ్యెఁ జేష్టల తెఱఁగు వికృతి, గనియెఁ దొలుత టెక్కోపమొక్కడికొంచ
గాపికాయనమదమత్తకరివరేణ్య, యానలకు నాథకేలితధ్యానలకును. ౧౫౮

వ. వెండియు నస్మధుపానచేష్టాప్రకటనంబు కుకవికవిత్వంబునుంబోలె వికట
పదబంధవాక్యసాకల్యంబై యవివేకివితరణంబునుంబోలెఁ బాత్రాపాత్ర
వివేకదూరంబై సామజాలానభూమియుంబోలె బహుప్రకారమదచమ
త్కారసరసంబై మందానిలుచందంబున నానావిధపరిమళసంక్రమణక్రమశ్రీ
యంబును గంధర్వలోకప్రకారంబున బంధురగాంధర్వసంధానగంధిలం
బును నుపవనంబునుంబోలె నుపవసంతసఖశిలీముఖముఖరితంబును నయ్యె
నయ్యెడ నయ్యాతుధానసూనుండు ప్రసూనపరంపరాపరికల్పితంబును
మరువకమందారపల్లవమాకందకిసలయవిసరవిరచితశయ్యాతలంబును గర్పూ
రదర్పసారకాశ్మీరవిస్మేరసౌరభగర్భితంబును నైనశయ్యాతలంబు నధిష్ఠించి.

సీ. పంచతంత్రంబులభావంబు లుబ్బించి యాలింగనంబుల నంటనలమి
సంస్కారముల షోడశస్థానములఁగల్గు కళ లొయ్యనొయ్య నె కరఁగఁజేసి
రాగంబు లెఱిఁగి సంయోగనీచాత్యుచ్చరతులఁగూడకతుల్యరతులఁగూడి
చక్రధేనుకముఖ్యచతురబంధంబులపాండిత్య మంతయుఁ బరిఢవించి
భావికృష్ణుండు గోపాలపద్మముఖుల, రాసకేళికిఁ దార్చునుల్లాస మెసఁగ
నొక్కఁడయ్యును బెక్కండ్రయుపతిమణులఁ, బరవశలఁ జేసిసంతసపడెఁజెవిభుఁడు.

వ. అట్టిసమయంబున. ౧౬౩

గీ. సతులతోఁగూడిరతిపరిశ్రాంతుఁడైన, దైత్యసుతుసేద దేర్పంగఁదలఁచెనొక్క
నవలతాన్తలతాంతగంధములుగొనుచుఁ,బొలిచెఁబ్రాభాతికానిలపోతకములు.

గీ. ఆసవాస్వాదనిర్భరం బైనసురత, సౌఖ్యమధినాథుచే యథేచ్ఛముగఁ గాంచి
వేగఁ గరువలి వీవన వీచుచుండ, నందె నిద్రామహానంద మతివపిండు. ౧౬౪

సీ. ఆకాశలక్ష్మినాసాగ్రముక్తాఫలద్యోతంబు చూపెఁ బ్రభాతతార
యెండకాలమునాఁటియేటినీరునుబోలె డొంకి వెన్నెలయు నిద్రింకులింకెఁ
జలికందునఁ జరించు వెలిదామరయుఁబోలె మధువైరిడాకన్ను మైలవడియె
తెక్కలువచ్చి తా మెక్కడికేగెనో చుక్కలగమి విచ్చెఁ జూడఁజూడ
జలజకాసారతటభూజకలితనిజకు, లాయకూలంబులందుఁ గోలాహలంబు
చేసెఁబులుఁగులుజక్కవచింతవాసెఁ, దలఁగెఁగందర్పుఁడానిశాంతంబునందు.

ఉ. తూరుపు తెల్లనయ్యె హిమతుందిలమారుతలూనవృంతమై
జాఱెఁ దరుప్రసూనతతి [1]జారజవారము తట్టువారెఁ గ్రోం
కారముచేసెఁ గుక్కుటనికాయము కల్వలు గన్నుమూసె నం
భోరుహ ముల్లసిల్లె నలిపోతము గీతముచేసె నల్గడన్. ౧౬౬

గీ. సమయఖనికుండు ప్రాగ్దిశాశైలతటము, త్రవ్వ నుద్భవ మైనకెందమ్మికెంపు
పట్రునయుఁబోలెఁజీఁకటికుట్రమన్నె, మూఁకవిప్పచునుదయించెఁగాఁక వెల్గు.

క. త్రిజగజ్జనసేవితుఁ డం,బుజబాంధవుఁ డుదయమైన భూసురముఖ్యుల్
భజియించిరి పాతకములఁ,ద్యజియించిరి దివ్యనవ్యతేజోధికులై. ౧౬౭

వ. ఇట్లు సూర్యోదయం బైనయనంతరంబ యాధైర్యఘుర్యుండు భార్యాశతం
బుఁ గృశోదరీసహస్రసేవితం బగుదాని నుచితప్రకారంబున నగరికిఁ బనిచి
ననిచిననిష్ఠాగరిష్ఠత్వంబున గ్రహకులశ్రేష్ఠు నారాధించి పురప్రవేశం బాచ
రించి విరించిసత్యలోకంబును వైకుంఠుండు వైకుంఠంబును ద్రిలోచనుండు

[1] జాలజకారము.

కైలాసంబును బాలించుకైవడి జావడింపక నిజరాజ్యపరిపాలనం బూజ్యుండై యుండె నయ్యవసరంబున నొక్కనాఁడు సూచీముఖ శూర్పకర్ణ వృశ్చికరోమ వికటశంబర దీర్ఘజిహ్వ మహిషాదు లగుమానుషాదుల యాదేశంబునఁ గావ్యోపదిష్టనయప్రయోగనిపుణుం డగువామనుండు తనకావించు కపటోపాయంబునకు నవ్వేళ యనుకూలం బగుట యెఱింగి సింగంపుగద్దియం బ్రొద్దుజరపుచున్న యన్నారాయణప్రియుం గూర్చి యి ట్లనియె.

వామనుం డనుదానవుండుకొల్వునకువచ్చుట.

చ. అవినయదూర సర్వభువనాధిప ధీనిధు లెల్ల మెచ్చ ని
య్యవనితలంబు నీకరతలామలకంబుగఁ జేసి మించి శా
త్రవులను మిత్రుల న్సమపదంబున నిల్పితి విట్టినేరు పా
దివియు రసాతలస్థలము దిద్దెడువారల కైనఁ గల్గునే. ౧౭౦

సీ. వృత్రాసురారాతి మిత్రత్వ మొనరింప ధనభర్త పరమబాంధవుఁడు గాఁగఁ
బాసీయపతి సుహృద్భావంబు జరపంగ సఖుఁడై కృతాంతుండు సంతసిల్ల
మునులెల్లఁ జుట్టరికమున మించి తిరుగంగ నెనరువాఁడై భానుఁ డనుమతింప
వశుఁడై గురుండు సర్వంబుఁ బరీక్షింపఁ జంద్రుండు ప్రాణమై సవదరిల్ల
దివిజులకు నెల్లమొదలైన దివిజుఁ డనఁగ,సద్గుణంబులయందు నాచారమహిమఁ
బ్రస్తుతింపంగఁ దొల్లింటి ప్రభువులట్లు,సాకితివి కీర్తి దానవచక్రవర్తి. ౧౭౧

మ. బలసౌభాగ్యవివేకవైభవములం బ్రఖ్యాతదానంబులం
గులవిద్యాగుణరూపశౌర్యమహిమన్ గోత్రావనజ్ఞానని
శ్చలత న్నిత్యదయావిశేషముల నాచారప్రభావోన్నతిం
గలరే నీ కెన మూఁడులోకముల లోకఖ్యాత తేజోనిధీ. ౧౭౨

ఉ. మొన్నఁటిపిన్నపాపఁడ వమోఘపరాక్రమసన్నుతుండవై
మున్నిటివీరవర్యులకు [1]ముల్లోకయించుక చూపుచున్న మీ
యున్నతి చూచి నాహృదయము బ్బెదు బాంధవమిత్రవర్గముల్
సన్నుతిసేయ సద్గుణవిశాలుఁడ వైతివి మే లనందగున్. ౧౭౩

గీ. నీవు చుట్టమవైన మనీషివర్య,చుట్ట మనరాదు రాజవై పట్టమేల
గుప్తకార్యంబు గలదు వాక్రుత్తు నొకటి,వినఁగవల తేని వినుము వివేకనిపుణ.

క. కార్యాకార్యంబులు దగ, నార్యులతోఁ దలఁపుసేయనట్టిమహీశుల్
వీర్యసమన్వితు లయ్యును,శౌర్యమునం గెలువ లేరు సమదాహితులన్. ౧౭౪

---

[1] ముల్లోనరించుక.

ఉ. పెద్దఱికంబునుం బ్రియము పెంపు వహింపఁగ రాజ్యమేలు మీ
పెద్దలు భక్తితోడ మముఁ బేర్కొని పిల్చి సమస్తకార్యముల్
తద్దయు నేము చెప్పినవిధంబున నాచరణంబు చేసి యా
గద్దఱు లైన శాత్రవుల కంఠలు చెండి రుపాయచాతురిన్. ౧౭౬

క. అది గావున మామాటలు, హృదయంబున కింపు చేసె నేనియు భక్తిం
బొదలుచుఁ దద్వృత్తాంతము, ముదలించెదఁ దేటతెల్లముగ సుగుణనిధీ. ౧౭౭

క. లోకాలోకనగేంద్ర, వ్యాకీర్ణప్రథితగుణలతానీక మహా
భీకరశాత్రవమదవద, ర్వీకరవినతాతనూజ విభవబిడౌజా. ౧౭౮

శా. ఉల్లోకామలకోమలేతరకళానుష్ణచ్ఛవిక్షీరం[1]వాః
కల్లోలస్ఫుట పుండరీకదివిషత్కల్లోలినీమల్లికా
వల్లీపల్లవఖడ్గఖండనశరద్వార్వాహసందోహసం
పల్లాలిత్యమిళద్యశోధవళిమభ్రాజద్దశాశాంతరా. ౧౭౯

మాలిని. శతధృతికులదీపా సర్వభాషాకలాపా
చతురనయధురీణా శౌర్యబాణారిబాణా
వితరణరవిపుత్త్రా విద్వదుద్యానచైత్రా
ప్రతిభటమదశిక్షా బంధురక్షాలిదక్షా. ౧౮౦

గద్యము. ఇది శ్రీహనుమత్కటాక్షలబ్ధవరప్రసాదసహజసారస్వత చంద్రనామాంక భారద్వాజసగోత్రపవిత్ర రామవిద్వన్మణికుమార రాష్ట్రఘంటావధానపరమేశ్వర హరిభట్టారకప్రణీతం బైన శ్రీనరసింహపురాణోత్తరంబునందు నుత్తరభాగంబునందుఁ బ్రహ్లాదగుణవర్ణనంబును ఋతుసమాగమంబును నతండు దైత్యకన్యకలం బరిగ్రహించుటయును వనవిహారంబును బురప్రవేశంబును ననంబరఁగు ద్వితీయాశ్వాసము.

---

[1] వాక్కల్లోలస్ఫుట.

శ్రీరస్తు.

# నారసింహపురాణము.

## ఉత్తరభాగము.

### తృతీయాశ్వాసము.

క. శ్రీసుందర ధృతిమందర, భూమక్షేమాభిరామ పుణ్యేతరమతీ
ధూమధ్వజభీమద్యుతి, ధామస్ఫుటహేతి రంగదండాధిపతీ. ౧

వ. ఆకర్ణింపు మట్లు శౌనకాదులకు రోమహర్షణుం డిట్లనియెఁ దనసూక్తంబులకు
ననురక్తుం డగుప్రహ్లాదుం గూర్చి వామనుండు, ౨

వామనుఁడు ప్రహ్లాదునకు నీతిం దెల్పుట.

క. జలమునఁ బుట్టిన జలజము, జలము విసర్జించినపుడె సమయువిధమునం
గులబలము విడిచి భూపతి, మలినుండగుఁ దేజముడుగు మఱిఁ గుఱఁ జరగున్.

క. నీనెనరువార మిందఱు, మీనియతిని నిన్ను విడువ నెఱుఁగక శాకం
బేనియు ఫలమూలజలము, లేనియుఁ గొని నవయుచున్కి నీ వెఱుఁగవొకో.

క. ఇదె బుద్ధిమంతుఁ డయ్యెడి, నిదె శాస్త్రనవిజయమునకు నేగెడి నీకుం
డిదె సుమ్ముఁ బ్రోచు నిజమని, యెదురెదురే చూచిచూచి యిటు గావుసెన్

క. కరనఖరలూనమగు విరి, పరికింపఁగ నెండిపోవుపరువడి మూల
స్థిరబలము లేనిభూపతి, పరిభవముం బొందుఁ గాని ప్రబలుఁడు గాఁడన్. ౬

క. దాక్షిణ్యంబున మముఁ దము, రక్షించుచు శత్రుపక్షరక్షివిగా కీ
వక్షీణాక్షుద్రభుజా, కౌక్షేయకక్షతరిపుఁడవు గమ్ము కుమారా. ౭

క. తరతరమునాఁటి హితుల, న్నరపతి విడనాడి యురక నమ్మి యితరులం
బరివారముగా నేలిన, విరవిరగా కేల గాంచు విజయశ్రీలన్. ౮

క. తనవారి మీఱి చేసిన, పని ఫలితముగాదు వరటిపద నివిరిన భూ
మిని గర్షకుండు విత్తెర, కిన దానం గనునె ఫలము కీర్తివిశాలా. ౯

క. తెగటార్పవలయుఁ బగఱుల, తెగలకు ఱికి నిప్పు దాదిత్టెట్టుఁ బోలెం
బగవారిక్రింద నణఁగిన, మగవాఁడు న్మగుసయును సమాను లధీశా. ౧౦

అన్న—మీరు బెంగఁగొని రోగముఁ బెంపక నిశ్చింతగా నుండుఁడు.
తమ్ము—రోగము నేను రమ్మనిన వచ్చినదా?
అన్న—బెంగరోగములు కొన్ని తెచ్చిపెట్టుకొనునవి కలవు.
తమ్ము—నేను రోగము వచ్చు నని యెన్నఁడును దలఁపలేదు.
అన్న—ఈవైద్యుఁడు పదిదినములనుండి చూచుచున్నను—
తమ్ము—నాగ్రహాచారమున కెవ్వరు కర్తలు—వీనిచేత నెందఱో బ్రదికిరి. వీనిని మార్పకుఁడు. నాకుఁ గొంచె మాయాసముగ నున్నది. కొంచెము తాళి రండు. ఈకాగితము సావకాశముగఁ జదివికొనుఁడు. (ఇచ్చును.)
అన్న—మంచిది(అని కాగితముం బుచ్చుకొని లేచును.)
తమ్ము—(భార్యతో)నామాటలు వినుచున్నదానవా?
భార్య—వినుచున్నదానను. బావగారితో రెండుమాటలు—
తమ్ము—అన్నయ్యా! మీతో నేమో చెప్పునఁట.
అన్న—ఎంతవెఱ్ఱి! ఆహా చెప్పుమనుము.
భార్య—నాసాహసమునకు క్షమింపవలయును. బిడ్డలకై నేను జీవింపవలయును గాని ప్రాణములకై కాదు. మీరు మాబిడ్డలను బెంపుఁడు; ఏమైనం జేయుఁడు మీకర్పించితిని. పెంచితిరా దేవుఁడు మిమ్ముఁ బెంచును. నమస్కారము. నాకు సెలవిండు. (ప్రక్కకుఁ దిరుగును.)
భర్త—ఎక్కడికి? నేను గూడవత్తును. ఒంటిగాఁ బోకుము. రంగా! రంగా!

(సేవకుఁడు ప్రవేశించును.)

భర్త—రామా! బిడ్డలుభద్రము. అన్నా నమస్కారములు. (కన్నుమూఁత.)
సేవ—(చూచి) హా! యెంతపని జరగుచున్నది. ఒక్కయడు గీయమ్మముందు. ధన మేమి సుగుణము లేమి యాయువుచెంతకుఁ బోలేవు.

(అని పోవుచున్నాఁడు.)

అన్న—హా! తమ్ముఁడా! అన్నదమ్ము లను ద్వంద్వము నేకశేషము చేసితివా. నీబిడ్డలను నీవలెఁ గాపాడఁగలనా.

గీ. అప్పు యే దని నాయన యగపడఁ డని,యడుగు బిడ్డల కేమని నుడువువాఁడఁ
గడువు తఱుఁగఁగ నేరీతిఁ గడపి పుచ్చి,మిమ్ము మఱపింపఁగలనొ నాతమ్ముగుఱ్ఱ.

(పోనిమ్ము అదృష్టవంతులు)

ఉ. ప్రేమను బెండ్లియాడి రొకరి న్వడనాడ రొకళ్లు రేఁబవ
ళ్లేమఱి యేని బంధుల సుహృత్తుల సాధుల బీదలం గడున్

గోమున నేకరీతిగనుఁ గొంచును గోరిన దెల్ల నిచ్చుచుం
దామును దించు నచ్చి రది దైవము మెచ్చెను జాలు వీరికిన్.

ఏమ్చి యేమి తెచ్చెదను: హా తమ్ముఁడా. అగస్త్యభ్రాత ననిపించుకొని నీయూఁతనే బ్రదికితిని. ఇంకను నీయాధారమే నాకు. నిస్సహా యుఁడ నైతిని! నీ వున్నప్పటి ధైర్యము నాకుండదు గదా!

(పరిక్రమించి ప్రవేశించి)

పసిపాపల నాచేతఁ బెట్టి నాసోదరుఁడు సపత్నీకుఁడై కాలవశము నొం దెను. (ఆలోచించి) శ్రీరంగనీతులు గావు. నిజముగా మనుజుఁడు—

మ. తనతో నేమియుఁ దేఁడు వచ్చునెడఁ జేతం గొంచుఁబోఁ డేగుచోఁ
దనయున్నంతికు నాది నాది యని యాస్తం జేర్ప నూహించు నే
ననుబొల్లాడితి నూనె రాచికొని యంటు న్నొంటు లే దాతఁడీ
ధన మె ట్లార్జనచేసె నచ్చెరు వగున్ దైవంబు దా ముఖ్యమా.

ఎద్దులపైఁ బెటికించుకొని పోఁదగినంత ధనమున్న నాతమ్ముఁడు ముప్పొద్దు దినియెను. ఆపూఁట కాపూఁటవారము నేనును నాబిడ్డలు నీడ్చు కొని వచ్చుచున్నాము.

గీ. తండ్రి యొసఁగెను నాకును దమ్మునకును,దన గడించినధనము నర్ధ మొసరించి
కడలిపాంగుగఁ బెరిఁగెను గాలుఁ జేయి, వచ్చి తమ్మునిసొమ్ము నాస్వమ్ము వోయె.

గుణములేక చెడెదరా కూడులేక చెడెదరా. ఆతఁడు నన్న న్యాయము చేయలేదు. నే నాతని జెఱుపఁ దలఁపలేదు.

ఉ. ఉండినవాఁడు మెక్కినను నూరక లేనియతండు పస్తుగాఁ
బండినఁ గాల మాఁగదు స్వభావమునం గమనించు విత్తవం
తుండయి తమ్ముఁ డుండె నొ గతుండనొ నిర్ధనుఁడైన నేను దా
నుండును మాట యొక్కటి జనోత్కరదూషణభూషణార్హ మై.

ఇపు డొకకష్టమువచ్చినది. నరములేనినాలుక నలుగుగు నాగుగు తెన్నులవారు.

గీ. కూఁతు పెండ్లికి నల్లునకును గొమార్త, చేతికిని సారెచీర కిచ్చెను విభాగ
మొనరఁగొడుకున కెల్లయునొసఁగెఁ బెంచు,దానికిని జెప్ప నాకు సార్థక్య మింత.

దీన నేను లోభగుణము చూపుట కవసరము లేదు. ఏమో డబ్బు పాపిష్ఠిది. తొల్లింటి చరిత్రము వినమా.

గీ. భోజునిగుఱించి ముంజుని బుద్ధివినమె, ధనము గుణమును మరలించు ధర్మమార్గ
మన్న నేమనియడిగించు నహహధనము, జగమునం దెన్నివిధములసంచరింతు.

నే నీధనముం గాపాడుట యొకయెత్తు. బిడ్డలం బెంచుట యొకయెత్తు. లోకాపవాదము రాకుండ మంచిగందమునం దొకకాలు నగ్నిహోత్రమునం దొకకాలును బెట్టి చరించుట యొకయెత్తునుగా నుండును. నామఱందలు పలికిన సాహసవాక్యములు! ఓ వనితామణీ!

ఉ. ఎన్నఁడు నీవు నాయెదుట నించుక పల్కవు బావగారికి
న్నన్నన చూపుదాన పతిమాత్రముగా నిది యేమి యంత్యమం
దిన్నఱి మర్మభేద లగు నే బళి నీవచనంబు లీశ్వరుం
డెన్నఁడె నీనిసుంగులకు నే నొకపాపము చేయఁ బూనినన్.

బాగుచేసినను బాడుచేసినను నేన కదా యింక—లోకమునకు భయంపడని క్రూరుఁ డుండునా! అడుగడునకు ధర్మసందేహములతో మరణించిన యోాదంపతులార! ఇపుడు చూడుఁడు మీసంతానమును,

చ. చదువను వ్రాయనుం గఱచి సద్గుణముల్ సదసద్వివేకముం
జదురుఁదనంబు గౌరవము శాంతము గాంచను లేనివారికిం
గుదురదు కల్గియుం జదువుకోఁ దగదో యిది పల్లెటూరు చి
క్కదు తగుపాఠశాల యు నొకండును జక్కని యొజ్జయిచ్చటన్.

(దీని కుపాయ మాలోచింపవలయును.)

(పరిక్రమించి యిరువురు బిడ్డలతో వచ్చి)

ఈపదనున మిన్నకున్నఁ జన్నవాండ్రు చెడుదురు. వీరిని రాజమహేంద్రమునఁ బెట్టి చదివింపఁ దలఁచితిని. అక్కడఁ బలువురు బంధుగులు విద్యావంతులు పండితులు పాఠశాలలు పల్లెకూటములు గలవు. ఇదియంతియు నాభార్యకు నచ్చదు.

క. పాపము! వీరల విడువఁగ, నోపక వచియించె నెన్నియో ప్రతిబద్ధ
వ్యాపృతము లైనవాక్కులు, కోపించెన్ బుజ్జగించెఁ గొంపోకుండన్.

ముద్దుచే విడువనోప మేని మనముద్దుబిడ్డలవలెనే వీరును జెడెదరు. ఉపపత్తియున్నపుడు నూరకుండ నేల యని నచ్చఁ జెప్పితిని. ఈపాపల కేమి తెలియును. తల్లివల దనిన వల దనిరి. నేను జదివింతు ననినఁ జదువ వత్తు మనిరి. (బిడ్డలంగాంచి) నాయనా! రంగా! రాముఁ డేఁడి?

రాము—(వచ్చి) ఇదిగో సిద్ధము.

రంగ—పెద్దనాయన! నన్ను రాముఁ డెత్తుకొనును.

తండ్రి—చెల్లెలిని నే నెత్తుకొందును. రంగనాయకి రావమ్మ!

బాలిక—(చంక నెక్కును.)

రాము—(రంగని నెత్తుకొని నడచును.)

రంగనా—పెద్దనాయన! ఇన్నిచె ట్లెందుకు?

తండ్రి—(నడచుచు) అమ్మా! ఇదియే యడవి. ఎక్కువచె ట్లున్నదే యడవి.

రంగ—అనఁగా ననఁగా నొకయడవి—అని చెప్పినావే కథ.

తండ్రి—ఆఁ. అదియే యిది.

రంగనా—ఇం దెవ్వరున్నారు. చదువులబడి—

తండ్రి—ఇందు మనుష్యు లుండరు. పెద్దపులులు—

రాము—ఈయడవి నడ్డుపడి మనము మామయ్యగారి యూరికి వెళ్లెదము.

రంగ—పెద్దయ్యా! పెద్దయ్యా! పెద్దపులి యేమిచేయును?

తండ్రి—ఆవులను మేఁకలను బట్టిచంపును.

రంగనా—అన్నయ్యా! చూచినావా.

రంగ—చెల్లీ! పెద్దపులిని జూచినావా.

రంగనా—బొమ్మచూచితిని. గొల్లపిల్లవాని నెత్తుకొనిపోవుచున్నది.

రంగ—పెద్దనాయన! పులి యావునుమేఁకను జంపక గొల్లపిల్లవానిని జంపెనే.

తండ్రి—ఏదో కథలో నట్లు చెప్పినారు.

రంగ—మనము భయపడకుండఁ జూడవచ్చునా?

రంగనా—పెద్దయ్యా! నాకుఁ బెద్దపులిని జూపింపవా.

తండ్రి—పోనుపోను గనఁబడును జూపెదను.

రంగ—ఇంక నెంతదూర మున్నదిబడి.

తండ్రి—ఇదిగో వచ్చినాము. ఎండతీక్ష్ణముగా నున్నది. రామూ! ఇక్కడఁ జెట్టుక్రిందఁ గొంతసేపు కూర్చుందము.

రాము—అట్లే కానిండు.

(అందఱును గూర్చుందురు)

తండ్రి—రామూ! నాకు నిద్రవచ్చుచున్నది. నిన్న మొన్న రాత్రులు పెద్ద యోజనలతో నిద్ర పట్టలేదు. బిడ్డలను జూచుకొమ్ము.

రాము—పండుకొనుఁడు. వీరినిగూడ నిద్రపుచ్చెదను.
తండ్రి—(ప్రక్కవైచికొని నిద్రించును.)
రాము—అమ్మా! నీవు పెద్దయ్యగారియొద్దఁ బండుకొనుము. ఎండ వేఁడికి నీమొగము నిద్రకు వచ్చినది. (పండుకొనఁబెట్టి జోకొట్టును.)
రంగ— నేను నీబట్టపఱుచుకొని పండుకొందును.
రాము—అట్లే పఱుచుకొమ్ము. (అనిపఱచి పరుండఁబెట్టెను.) (తనలో) ఈ ఘోరవనముదారి నేలరావలయును. బండ్లులేవా యేల నడపించుకొని పోవలయును. గుఱ్ఱ్కేఁడు మంచినీళ్లు తెచ్చినాఁడా! చెంబు దెత్తునా యనిన దారిపొడుగున గుంటలే యనియెను. రెండురొట్టెలు చేతఁబట్టుకొందునా యనిన నెక్కడఁజూచినఁ బ్రతివృక్షమునఁ బండ్లే యనియెను. ఏమి తలంచి నాఁడో యెఱుఁగరాదు.
తండ్రి—(గుఱక పెట్టి పలవరింతలుగా) నాతమ్ముఁడు వ్రాసినకాగితములో నొక్కముక్కయున్నది. పెద్దవారు కాకుండ నాబిడ్డలు మరణించిన యెడల సర్వధనము నీకే చెందునని.
రాము—(విని) ఔర! వీనితలంపు.
తండ్రి—ఈతొడుసు విడుచుట యెట్లు.
రాము—(విని) తొడుసేమి, విడుచుట యేమి, నేనే యీతనికిఁ దొడుసునుగాఁ దోఁచి యుండవచ్చును. ఆహా; దురుద్దేశము లెట్లు బైలు వెడలుచున్నవి!
తండ్రి—వీనిని గాని వీరిని గాని చీఁకటిగుహాలోఁ బడవైచి—
రాము—(విని) చంపివేయరాదా.
తండ్రి—రాముని దీసికొనివచ్చుట పొరపాటు.
రాము—నే నిపుడే తప్పుకొందును.
తండ్రి—అన్నిశ్రీరంగనీతులు చెప్పిన నే నేమి తలంచుచున్నాఁడను. ధనాశ పెట్టిన రాముఁడు చెప్పినట్లు వినఁడా.
రాము—నేనా! కుడిచినయింటికిఁ గ్రుంగు దెచ్చెదనా.
తండ్రి—(గుఱ్ఱు పెట్టుచున్నాఁడు.)
రాము—నే నిపుడు తప్పుకొనవలసినదే—మఱియీపిల్లలగతి. ఈదుర్మార్గుఁడు లేవకమున్నె వీరి నెక్కడికైనఁ గొంపోయిన—
రంగనా—నాకు బొబ్బకావలయును (నిద్ర, లోఁ బలవరించును.)
రాము—ఇది గట్టిచిక్కే! నీటికై యెక్కడికిఁ బోదును.

రంగ—(నిద్రలో) అదిగోఁ బెద్దపులి.

రాము—ఏమియు లేదు పండుకొనుండు.

తండ్రి—(నిద్రలో) నేను లేచి రాముని బండుకొమ్మని వానితలపై బండ యెత్తి వైచెదను.

రాము—దుష్టుఁడా నాకు నిద్రపట్టునా. పనునాల్గేండ్లు[?] నను లక్ష్మణస్వామివలె.

(అడవిలో నొకయల్లరి)

రాము—(విని ఓహో! ఇది యొకవిపత్తు—ఏమి చేయుదును. ఏమైనను మంచిదే-(అని మెల్లఁగ) నాయన రంగ! లెమ్ము: నీకొకమాట చెప్పెదను.

రంగ—(లేచుచున్నాఁడు)

రాము—(రంగనాయకిని లేపును)

రంగనా—(లేచి) యేమి చిత్రము చూపించెదవు.

రాము—మన మీచెట్టుమీఁద నెక్కి చిత్రము చూతము. క్రిందఁ జీమలున్నవి. పెద్దపులులు వచ్చును.

(అని యిరువురను జెట్టెక్కించును.)

తండ్రి—(గుఱ్ఱు వెట్టుచున్నాఁడు)

రాము—ఈతని గూడ లేపుదునా? వలదు. ఇట్లే యుండనిమ్ము. అడవిలోఁ గలకల మెక్కుడుగా నున్నది. నేనును జెట్టెక్కి. బిడ్డలను గట్టిగాఁ బట్టుకొందును. (అనియట్లుచేయును) (ఒక్క తుపాకిధ్వని వినఁబడును)

రంగనా—రామా! ఇదియేనా చిత్రము.

రంగ—రామా! నాకు భయముగా నున్నది.

రంగనా—పెద్దపులి వచ్చును. భయపడకురా అన్నయ్య.

రంగ—నాకుభయము. పెద్దనాయన లేవలేదు.

రంగనా—పెద్దమనుష్యులను గఱవదు.

రంగ—ఏమిటి పులి యేది?

(అంతలో గాండ్రుమనుచు నొక్కపులి వచ్చి నిద్రించువానిగొంతు క్రోల్లఱచితానును వానియొద్దఁ బడును.)

రంగనా—రామా! ఇదియేనా చిత్రము.

రంగ—ఇదియా చాఱలమెకము. నాకుభయము.

రంగనా—పెద్దయ్య చెప్పినాఁడు—మనుష్యులను గఱవదు. భయపడవలదు.

రాము—బాబు! భయము లేదు. పులి చచ్చినది. (తనలో) వీరిపాలిటికి—వీని యూహలకు వెంటనే ఫలముగదా.

(మనుష్యులధ్వని వినవచ్చును.)

రాము—ఏటువడి పాఱివచ్చిన యీపులిజాడలు దీయుచున్న యెవ్వరో వేఁట కాండ్రు వచ్చుచున్నారు గాఁబోలును. (అని చెట్టుదిగును)

(ఒకరాజును గొందఱును బ్రవేశింతురు.)

రాము—(ఎదురేగి మ్రొక్కును.)

రాజు—(చూచి) కిరాతార్జునీయము జరుగునా యేమి. నేను గొట్టినపులిని నీవెట్లు పట్టుకొంటివి.

రాము—మహారాజు! నేనుగాదు. మీదెబ్బకే వచ్చి యిక్కడఁబడి చచ్చెను.

రాజు—నీవృత్తాంత మేమి. ఈచచ్చినవాఁడు నీ కేమి కావలయును.

రాము—మహారాజా!

ఉ. మీపరిపాలనంబున నమిత్రవిఘాతి బృహత్పురంబు దా
దాపున నొక్కపల్లె విదితంబగుఁ గృష్ణసరస్సనాఁగ నీ
పాపలు దానిలోన ధన పాలుని సంతతి వీరిరక్షకై
యోపిచరింతు నేను బృథులోగ్రవనంబున నప్రమాదినై.

రాజు—ఈయుగ్రవనములోనికి రానేల?

రాము—మహారాజ!

మ. ధనపాలుండు సతీసమేతముగ మర్త్యం బుజ్జగించెం దదా
జ్ఞను సంరక్షకుఁ డయ్యె నన్న యితఁ డా సంసారికిం జెప్పి పె
ట్టెను గృత్యంబులు వ్రాఁతమూలమున ముట్టెం గొంతద్రవ్యంబు నే
మనువాఁడక్క గతబుద్ధి తెచ్చె మము న న్యాయంబుగా భూమిపా.

రాజు—నా కర్థమగునట్లు చెప్పుము.

రాము—ఇది విషమసంధి ప్రకాశము చేయరాదు(అనిమెల్లఁగ) ఇదికారణము.

రాజు—(విని)దైవ మెక్కడ లేదు! మంచిది! నీవు వీరిని మాతోఁ గొనిరమ్ము. నేను దద్గ్రామాధికారికి నిజవృత్తాంతము వ్రాయించి నీతోఁ బంపించెదను. ఈపాపలను గాపాడుటకై తగినపాలకసంఘమును నిర్ణయించెదను.

రాము—మహారాజ! నాకంతే కావలసినది.

(బిడ్డలను జెట్టునుండి దింపి) ఈసార్వభౌమునకు మ్రొక్కుఁడు (అని మ్రొక్కించును.)

రాజు—(దగ్గఱదీసి చేతఁదట్టును.)

రాము—రండు మనము పోదము.

రంగనా—పెద్దయ్యను లేపుము.

రాము—నిద్ర మేల్కని తానే వచ్చును. మన మీప్రభువుగారితోఁ బోవుదము.

రంగ—మమ్మిద్దఱను నీ వొక్కడవే యెత్తుకొందువా.

రాము—ప్రభువుగారిగుఱ్ఱపుబండి యున్నది.

రంగ—చెల్లీ! రా. గుఱ్ఱపుబండి యెక్కుదము

రాము—అజ్ఞానమా! నీవంటిది లేదు. ఈబిడ్డ లేమి చెప్పిన నది నిజ మని నమ్మునట్లు చేయుచున్నావు. ఓ భగవంతుఁడా! గంపెఁడుకన్ను వెట్టుకొని చూడకుండ నీ వూరకుంటివేని ప్రపంచము గతి యే మగును.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రభుసందర్శన మనుద్వితీయరంగము.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## రుధిరోద్గారిసంవత్సరము ౧౨-వ సంపుటము.

---

## విషయసూచిక.



---

# పరిషత్కార్యాలయమున వెలకుదొరకు గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1. విప్రనారాయణచరిత్రము—చదలువాడ మల్లయకవి - - | 0 | 8 | 0 |
| 2. జైమినిభారతము—(వచనము) సముఖము వేంకటకృష్ణప్ప నాయఁకుఁడు - - - - - - - - - - | 0 | 12 | 0 |
| 3. కవిజనాశ్రయము—వేములవాడ భీమకవి - - - - - | 0 | 10 | 0 |
| 4. చంపూరామాయణము—ఋగ్వేదికవి వేంకటాచలపతికవి - | 1 | 0 | 0 |
| 5. నీతిసీసపద్యశతకము—తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు - - | 0 | 2 | 0 |
| 6. జ్యోతిశ్శాస్త్రసారము—శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులుగారు బి. ఏ, యల్. టి. - - - - - - - - | 0 | 8 | 0 |
| 7. జ్ఞానప్రసూనాంబికాశతకము—శిష్టుసర్వశాస్త్రికవి- - - | 0 | 2 | 0 |
| 8. సర్వేశ్వరశతకము—యథావాక్కుల అన్నమయ్యగారు - | 0 | 3 | 0 |
| 9. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము—జ. రామయ్యపంతులు గారు బి. ఏ, బి. ఎల్. - - - - - - - - | 0 | 8 | 0 |
| 10. కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దయకవి - - | 0 | 8 | 0 |
| 11. చంద్రభానుచరిత్రము—తరిగొప్పుల మల్లనకవి - - - | 1 | 0 | 0 |
| 12. అకారాద్యముద్రిత గ్రంథసూచిక - - - - - - - | 0 | 8 | 0 |
| 13. ప్రాకృతభాషోత్పత్తి—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు - - - - - - - - - - - | 0 | 12 | 0 |
| 14. శివతత్త్వసారము—మల్లికార్జున పండితారాధ్యులు - - - | 0 | 12 | 0 |
| 15. Defence of literary Telugu జయంతి రామయ్యపంతులు గారు బి. ఏ., బి. ఎల్. - - - - - - - - - - | 0 | 8 | 0 |
| 16. శివరాత్రిమాహాత్మ్యము—శ్రీనాథమహాకవి - - - - - | 0 | 12 | 0 |
| 17. ఆర్యభాషావిభాగము—శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు - - - - - - - - - - - | 0 | 8 | 0 |
| 18. దాక్షిణాత్యాంధ్రులు—అక్కిరాజు ఉమాకాంతముగారు - | 0 | 4 | 0 |
| ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికకు చందా సం॥ కు - - - | 3 | 0 | 0 |

కావలసినవారు:—

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శిగారికి చెన్నపురి వ్రాయవలయును.